# సంగదోషము




ఇది

మల్లంపల్లి మల్లికార్జున ప్రణీతము.

అభినవ సరస్వతి నుండి పునర్ముద్రితము.




మొదటి కూర్పు 700.

గుంటూరు

చంద్రికా ముద్రాక్షరశాల యందు

ముద్రించి ప్రకటింపబడియె.



వెల. 0-2-0.




# సంగదోషము.

గీ॥ అర్థవాదములుగ నయ్యైకథలు సెప్పి । ధర్మబోధసేయు తాతఁగాంచి । ధర్మజుండు వల్కుధర్మజ్ఞ ! సందియం । బొండు కల్గెఁ దీర్పు మోమహాత్మ ! ॥ ౧

గీ॥ సంగదోషంబు కూడదు సంయములక । టంచుఁ దెల్పితి వదియగు హానికేత । నముల నెట్లుందు రయ్య వన్యంబులైన । జంతువులచెల్మిరోనియుఁ జలుపకుండ॥ ౨

క॥ మృగములతోఁ బక్షులతో । నగములతో లతలతోడ నగచరములతోఁ । దగుగతిఁ బరిచయములవడి । నఁగలదె దోషంబు మునిజ సంబుల కకటా॥ 3

గీ॥ అనుచు వేఁడినయాధర్మతనయుఁ గాంచి । పల్కె శాంతనవుం డోయి పార్థ ! వన్య । జంతువులమాటలుంచుము సంయములక । చేతనంబులయందైనఁ బ్రీతి తగదు॥ ౪

గీ॥ ఏపదార్థమ్మసందేని యింత పేర్మి । కలుగనిచ్చిన బంధంబు బలియు మొదటఁ । బిదప సర్వంబుఁ గల్గుఁ గౌపీనరక్ష । ణార్థకోయం పటాటోప యనఁగ వినమె॥ ౫

సీ॥ మౌని యొకండు కౌపీనము కొఱకిక్కైవైచిన యెల్కకొఱకునై పిల్లిఁ బెంచెఁ జిల్లికాహారంబు క్షీరముగావలె నని యొక్కకుండోధ్ని నావుఁ గొనియె దాని మేఁతకు నొక్కతలఁ బొలం బార్జించె దానికైకర్షకత్వంబుఁ బూనె దానిచేఁ బెద్దగిత్తలు హాలంబు లున్ననుగాఁ గాఁదగినపరికరము బలిసె యతివరా యేమి యిది యని యడిగినంత । విస్మయంబున నతఁడు కౌపీనరక్ష । ణార్థకోయం పటాటోప యనియె, యతియు । గోఁచి పైఁబేర్మి లేకున్నఁ గొఱఁత పడునె ? ॥ ౬

వ॥ ఇఁక మృగపోతంబు మీఁది స్నేహంబు వాయని యోగుల యజ్ఞానంబుం గుఱించి యొక్క యితిహాసంబాకర్ణింపుము॥ ౭

క॥ ఉపరతకరణవ్యాపృతు । లపగతకర్మప్రవృత్తు లగుయోగిజనుల్ ।
తపియించుచుండ్రి నిర్ద్వే । యుపదంబగు కొండపీట నతిలౌకికులై॥

గీ॥ గలికిపలుకలు కొంకాకుచు గంతులిడుచు । బెదరుఁ జూపులఁజూచు
చు బిక్కవడుచు । నొంటుహరిణార్భకంబునక్కొండపీఠి । యుప
వనంబునఁ దిరుగాడుచుండు నెపుడు॥ ౯

గీ॥ తమిని యోగుల పజ్జను దలుచుఁ జనుచు । నిషు దపుడు నాకమో
వేళనేనివారి । యొడలు నాకుచుఁ జనువున్నై నుండుదాని । పైని
యోగుల కుదయించెఁ బరమకరుణ॥ ౧౦

క॥ అలవడె నొకరకమగు పరు । గల మృగపోతమున కదియ యోక
క్షించెన్ । గల గతు లేవియు నా యి । మ్ముల నెఱుఁగని యో
గిజనుల మోమోటమ్మున్॥ ౧౧

గీ॥ గలికిపలుకల కొలికా మృగమ్ముమునుల । యునికిపట్లకుఁ బోవు
చునున్న కొలఁది । నగ్గలం బయ్యె యోగులకాదరంబు । దానిచే
తన ప్రేమబంధంబు బిగిసె॥ ౧౨

గీ॥ స్నేహబంధంబునుం బిగిసినకొలంది । దానికున్నతపదవి యీఁద
లఁపగలిగి । ప్రేమయధికతరంబయ్యెఁ బ్రేమయు నధి । కతరమైన
కొలంది సంగంబు హెచ్చె॥ ౧౩

వ॥ ఇట్లు కొంతకాలంబు గడచుటయు॥ ౧౪

క॥ ఒకనాఁడా సన్న్యాసులు । చకచకనృత్యంబుఁజల్పు స్మరహరుఁగను
పూ । నికఁ బోవఁగ నామృగశా । బకముం దాఁబోయెఁబరుగుప
రుగున వెంటన్॥ ౧౫

గీ॥ హరునియానతి నని యోగివరుల కడకుఁ । దలచుగాఁబోయి మంచి
పద్ధతిని బోగ । చేష్టలెఱిగించు నానంది శిష్యకోటి । జింకనుంగూ
డఁబోనిచ్చె శివుని కడకు॥ ౧౬

గీ॥ జ్ఞానమెఱుఁగని పశువుల జాతియగుట । దేశకాలమ్ము లెఱుఁగ కా
వేశ మొత్తు । నగణేడనగతిఁ జూపుట సహజ మగుట । హరిణపో
తంబు నందందుఁ బరుగులెత్తె॥ ౧౭

మ॥ హరుఁడుం దాఁడవనాఁడునాఁడు గల య త్యానందమూర్ఛన్

మహా । దర మొప్పారఁగ నక్కురంగమును జేతం దాల్చియాటాడ,
దే । వర ! మీ కియ్యది యందమయ్యె నని యవ్వారుం బ్రశంసింప
న । పరమాత్ముండును గేల నమ్మృగముఁ దాల్పంబూనె
నేనాఁటికిన్ ॥ ౧౮

గీ॥ తాండవం బాడువేళ నతండు దాని । దండకుం బిల్చి తోఁటిగా నాదర
ముఁ జూపు । చుండుఁ దక్కిన వేళల నుండు నదియు । గొండవీటిని
యోగు లుండునందు ॥ ౧౯

మ॥ ఇటులుండన్ హిమభూధరాత్మజయు దానే తెంచెఁ బుట్టింటికి, కే
గుటలోఁ దానినిఁ గూడ సేవకులతోఁ గొంపోయె నా దేవి, యా
దట నాచన్నపురంబునం దదియు విద్యావంతులౌ వారి ముం
గటఁ జూపించెనఁ జేశదాశుగమనప్రౌఢీపరీపాకమున్ ॥ ౨౦

మ॥ హిమభూభృద్వరు సేవసేయుటకు నెందుండియో వచ్చి యం
దమరం గాఁపురమున్నవారలును బౌరాగ్రేసరుల్గాడి యు
య్యుమమీఁదం గలగౌరవంబునఁ దదీయోద్వేగముం జూచి యం
దముగాఁ గట్టిరి లేడికిన్ మెడకుఁ గంటల్గాలికిన్ సూత్రవ్వాలన్ ॥ ౨౧

క॥ ఇటులప్పౌరులయాదృతి । నటఁ గొన్నాళ్లుండునంత నా లేడి తనం
తటి డిల లేదను మద మెనఁ । గుటచేఁ గాఁబోలుఁ దలఁకుఁ గొ
మ్మలు మొలచెన్ ॥ ౨౨

చ॥ కరులకుఁ బుట్టినిల్లగు నగంబది యౌట మతంగజేంద్ర సం
హరణపరాత్మ యౌట మది నారసి యానగరాజపుత్రి దు
ర్భరపరతేజసమైన మృగరాజము నింటనె డించిపోయినన్
బరిచరులైన వారివలనన్ హరియు న్మృగవృత్తమున్వినెన్ ॥ ౨౩

క॥ విని వినినంత నెతనమన । మునఁ గల్గిన మేర లేని మోదమునకుసూ
చనముగ మృగమునకంపిం । చెను వార్తయు నమ్మృగాధశేఖరుఁ
డంతన్ ॥ ౨౪

క॥ మృగమును మృగరాజుపయిం । దగవగు విశ్వాసముంచి తగునుత్త
రము । మృగరాజునకుం బంపెను । జగమెల్లను మేటి సంతసంబున
మును గన్ ॥ ౨౫

చ॥ మదమున వేల్పురాచసిరి మాపిన యా పెనుపోతురక్కసుం
గదనమునందుఁ గూలిచి జగంబులు మూఁడును బ్రోచినట్టి య
మ్మదవతి భర్త పాదపరమాణువునైనను మెచ్చు గౌరియుం
బదపడి వచ్చె యోగిజనవర్ణితపాటికిఁ గొండపీటికిన్॥ ౨౬

ఉ॥ వచ్చిన దేవితో మరలివచ్చిన లేడికి వచ్చినట్టి యా
యుచ్చపదంబు పేర్మిఁ గని యోగులు మెచ్చఁ దొడంగి రెంతయుం
బచ్చికఁ దెచ్చి మేపుచు సెబాసని గంతులు వేయఁ జేయుచు
న్మచ్చిక సేయుచుం దపము మాటఁ దలంపక రాత్రియుం బగల్॥ ౨౭

వ॥ ఇట్లుండ నమ్మునీంద్రుల కాలేడిమీఁది వాత్సల్యంబు పెచ్చు
పెరిఁగిన కొలంది నొక్కనాఁ డందఱుం గుమిగూడి మృగరాజు కడ
కుం బోయి మృగేంద్రా! యీ హరిణపోతంబు బుద్ధిసంపన్నంబు, నీ
శ్వరపాణిలాలితంబు నందిశిష్యకోటిసమ్మానితంబు దీనిని భవ
త్సమీపవర్తిఁగాఁ జేసికొని భవదీయసామ్రాజ్యంబేలు మిదియుం
ద్వత్తుల్యం బగుటచే నింతగాఁ జెప్పితి మనవుఁడు మృగేంద్రంబు
కనలి॥ ౨౮

చ॥ రణమున నేను భూమిధరరాజకుమారికిఁ జేయు సేవలో
నణువును జేయఁగాఁ గలదె యా మెను మోయఁగఁ జాలునే మదిం
బ్రిణఘాముగల్మి మీర లిటుపల్కఁగవచ్చునుగాక యేటికీ
గుణితము నాసమీపమునకుం జనుదెంచుటకైనఁ జాలునే॥ ౨౯

వ॥ అనిన యోగులందఱుఁ దమమాట చెల్లింపదాయెనను
మాత్సర్యంబున నమ్మృగపోతంబుచే "సీసటలంగా పాడికొ" మ్మని
యొకనరసింహముచేఁ గమ్మనంపింపం జేసిన మృగేంద్రంబును "నుచి
తసన్నాహంబుననుండు" మని ప్రత్యుత్తరంబంపి గర్జించినంత॥ ౩౦

ఉ॥ గుండెలు వ్రక్కలై వడఁకుఁ గొంచు మృగంబు మునీంద్రులార మీ
యండకుఁ జేరినందుల కహో యిటు దెచ్చితి రయ్యొ! యెట్లు మా
ర్కొందు మృగేంద్రునిన్ రణము గోరెద నన్నది ప్రోచు నన్న నా
కొండికనేడితోడ మునికుంజరులిట్లని రేతంబునన్॥ ౩౧

ఉ॥ శీతనగాత్మజాధవుఁ జేత నెసంగెడి దానవీవు నీ
నేతకు భార్యయైన యొకనీరజగంధి పదద్వయంబుదా
నేత ఱేఁగొల్చునాహరి, నొకింత భవద్గరిమంబు హెచ్చు నీ
కోతువుఁ బోలె సింగమునకూరక వంగినలాము లేటికిన్॥ ౩౨

ఉ॥ సింగమునీవయింగినిసి చేసితిదేమి!, సతంబుఁ గొండవీ
టంగదనీనివాస, మొకట న్నిను నేదియొ చేయఁ బోవ నా
యంగజసంహరుండు కృప నాఁగఁడె, యింతకు నంతయేలవ
చ్చెం, గరిమీఁదఁ బోలె నినుఁ జూచినఁ గోపమురాదు దానికిన్॥ ౩౩

చ॥ పరుగిడఁ జాలమిన్ గరుడు పాయనిభీతిని "సింగ" మన్న య
క్షరములు విన్నయంతనె మొగాదిగ దిక్కులుచూచి మ్రగ్గఁగా
కరవశిఁ బాఱఁ జేర్చియును నూరక సింగమటన్న భీతినై
నెఱఁగెదవేల నీకునిది హీనతగాఁగనుపట్టదే మదిన్॥ ౩౪

ఉ॥ నీపయిమూటిమాటికి నఖండితభక్తిని సింహపాదముల్
వావిరిఁ గొల్చు భంగిఁ దలవంపు ఘటించెడిమాకు, గారణం
బీవు నెఱుంగు దేవునిన! నిత్తుల చర్మము మేముదాల్తు మా
యీవిధి నీకుమాకుఁ గల దెక్కుడు చుట్టఱికంబనాదిగన్॥ ౩౫

చ॥ ఎఱుఁగుదుగాక లేడులుమృగేంద్రుని కయ్యమి యేసి నీకు నా
హరిభయమేల సాంబుకరమందువసించెడిదాన వైతి ని
న్నరయఁగ నేరికిన్ సుఖము, నాశ్రయపుంబల మీడఁ బోదు, కొ
మ్మరిమనునున్నపక్షులు కపాయము బోయలవల్లఁ గల్గునే॥ ౩౬

ఉ॥ అమ్మక చెల్ల! యింకొకటి యూఁదకు రాకవదింప లేదుసూ!,
కొమ్ములు లేవు సింగమునకున్, గల వయ్యవి నీకు, నీవు సిం
గమ్మున కేలజంకెదవు, కయ్యము వచ్చిన వచ్చుఁగాక, నీ
వెమ్మయి గెల్వవచ్చుఁ, బరువే గలదందుకుఁ దక్కుపట్టునన్॥ ౩౭

క॥ ఏమైననుసరియే శివు। స్వామికిఁ సేవనమ్మగావించుటచే
భావానుచరసుసింగము। నీనుహింసము హెచ్చు హరుఁడు నిను
లాలించున్॥ ౩౮

ఆ॥ వె॥ అయ్యవారునిన్ను నల్లారుముద్దుగాఁ । బెంచుచుండనకట పెం
పువిడిచి । యమ్మవారినొకరైనసింగమునకు । నెఱఁగెదేల !
పిచ్చియెత్తెనేమొ॥ ౩౯

క॥ అనిపలువిధముల బోధిం । చినపై నావెఱ్ఱిలేడిచిత్తమ్మును దై
వనియతి గర్వమ్మదిమే । కొనినను భయమొక్కపక్క గుంజఁ
దొడంగెన్॥ ౪౦

చ॥ భయమును గర్వముం గలసి పాతరలాడఁగ "జోగులార ! నా
నయముగణించిమీరిపుడు నాకయిచెప్పినసుద్దులెల్ల ని । శ్చయము
గవిశ్వసించితి, నసాధ్యము సింగముతోడిపోరితం । బయమునకిచ్చ
గించుమృగ మయ్యదిపెట్టికొనంగఁబోలునే॥ ౪౧

ఉ॥ అయ్యకునాపయిన్ గలద యందముపేరిముడి, యమ్మగారి పె
న్నెయ్యపుఁబట్టుసింగమది, నిక్కముతెల్పెదఁజిత్తగింపుఁ డా
దయ్యపుఱేఁడు నుంతయు ప్రశాంతుఁడుగాఁ, డమవారుచెప్పుచొ
ప్పెయ్యెడఁగానిదాఁటఁడని యించుకనామది సంశయించెదన్॥ ౪౨

క॥ సన్న్యాసులార ! యెదనా । కున్నభయముఁదెల్పితిని మహాహంక్ర
వమా । నన్నమగునప్పుడాతఁడు । నన్ను విడిచెనేని మీరు ననుఁ
గాచెదరే॥ ౪౩

క॥ ఆయమ్మకుభయపడిగా । దే యాతఁడు నెత్తిమీఁదియిల్లాలిన్ బోఁ
ద్రోయంగనొప్పికొనె నే । నాయన కేపాటి, యాపె కరి నగునె
డలన్॥ ౪౪

ఉ॥ ఆ యమవారివాహనము నంఘ్రులుగొల్చి యథేచ్ఛ జీవనం
బేయెడఁజేయునాకు నొక టిట్టిదిగర్వము పుట్టెనేని, గో
పాయతశీల చండి, తన యర్వముపట్టుననుండి యెట్టులో
కాయజవైరిమానసము గ్రుక్కనఁద్రిప్పి యడంపదే ననున్॥ ౪౫

క॥ సగముశరీరం బాలికొ । సఁగినపరిబుద్ధుండతండు జాయావశుఁ డే
వగ ననుఁగాపాడెడిన । య్యగేంద్రతనుజాతకున్ భయంప
డువాఁడె॥ ౪౬

ఆ॥ వె॥ తబిసిరాయులార ! తగనన్ను " దిగుదిగు " । మంచు మీర
లిప్పుడందు రంతె । కాని, దిగినమీఁదఁగా పాదువారుమీ ।
గ్గారు హాయఁ జుఁగూడఁ గాఁడుసుండు॥ ౪౭

చ॥ జగముసమస్తము న్ లంకముసల్పెడి నిష్ఠురుణుండు శంభుఁడ
య్యగపురవాసి నా కసజయంబొ మఱొండొ తటస్థమైనయ
ప్టోగిఁ దనభాగ్యపక్షమున నుండుటమాని కృపానుషంగియై
పోగులునెనాకునై దుడుకుఁబోకలు ముప్పొనరించుఁ బిమ్మటన్॥౪౮

క॥ మనలోమనమాట వృథా । మన కెందుకు దలకుఁదగని మచ్చరము
లు మీ । యనుమతికి నన్యథావ । ల్కినసను మన్నింపుఁ డింకుఁ
గినియకుఁ డనఘుల్ !॥ ౪౯

క॥ లలి నిటులను లేడిని రో । గులు గనియిట్లనిరి " నీకు గొప్పగడింప
న్వలయుననికాని మాకిట । ఫలమున్నదె లేశ మేనిఁ బరికింపుమెదన్ ॥

ఆ॥ వె॥ పూర్వపుణ్యయోగమున నమ్మహాదేవు । పాణియందు నిమ్మ
పండుభంగి । నలరుయోగమబ్బె నట్టినీ కకట సిం । గంపు
గొలువు సిగ్గుగాదె చెపుమ॥ ౫౧

తే॥ గీ॥ కాదుకూడదు మేమెల్ల గట్టిపట్టు । పట్టెదము నీకువచ్చినభ
యము లేదు, । " వడ్లగింజకు నెందేని వడ్లగింజ । వటికిపట్టు
నె " పంకింపవలదె సుంత॥ ౫౨

క॥ అని యెట్లెట్లో మెడవిటి, చిన మోమోటమ్ముకల్మిఁ జెడిపోవుట
కై । నను సమ్మతించి కదుఁబే । ర్మినియోగులమతమునకుఁ దిరిగె
హరిణ మొగిన్ ॥ ౫౩

క॥ భయమొకటిదక్క సింగము । పయిఁగలభక్తి సకలమ్ముఁబాసి ప
యికిఁ ద । ద్దయు గర్వముగుపడఁగ నె । మ్మెయి మెలఁగన్ దొ
డఁగె మేరమీఱి క్రమమున్ గన్ ॥ ౫౪

చ॥ అదిగని పెట్టిసింగము మున్ నియమపాట గణింపదయ్యె నా
సదయతఁజూచి లేడి విడనాగెనుసాధ్వస మింకఁగొంత, యీ

యదనున న్యాయవేదులమటంచుఁ గడుంగడువిఱ్ఱవీఁగు కు
ర్వాదు లెటులో వివాదమును రేఁగఁగఁ జేసిరి యోగు లుద్ధతిన్॥౫౫

ఆ॥ వె॥ హాని యోగులెఱుఁగి హరిణమ్మునకు । సింగ, మునకుఁ బోర
దెట్లో మొనయఁ జేసి । రకట! యొకట నిట్టులగుఁ గదా!
యెంతేని । యోగులైనవారి యూహకూడ॥ ౫౬

క॥ మతిచెడిసన్న్యాసులు తన । గతికిన్ భంగమ్ము దెచ్చు కలహము చే
కూ । ర్చుతఱిన్ హరిణము "చెడితిఁ జె । డితి" నని తనమనమున
నన్ గడిందిగ వగచున్॥ ౫౭

క॥ వగచెడి వగచెడి లేడిని । బగసాధింపుమని యోగివరు లూరక తా
మొగిఁ ద్రోయఁ జొచ్చి రయ్యది । "తగ" నని మొఱ వెట్టుకొనినఁ
దగ్గరువారల్॥ ౫౮

ఆ॥ వె॥ "కొండ నీదుపట్టు కొండప్రక్కలనుండు । బండలెల్ల నీదుప
ట్టుకొండ । కెప్పుడో యూచ్చిపట్టి యొఱికలు మొల్చునం । చె
ఱుఁగు మింత నాకు నెఱుఁగఁబడియె"॥ ౫౯

తే॥ గీ॥ వట్టిసన్న్యాసు లెట్టులో పదరువార । లంచు మది నెంచఁబోకు
మేమనఁగ మిగుల । లౌకికజ్ఞానమున్న సుశ్రీకులము వృ । థా
గ శ్రోత్రియులమటంచుఁ దలఁచెదేము॥ ౬౦

ఆ॥ వె॥ కొండకొనలనుండి బండలు దొరలించి । సింగమునకు నీవు చి
క్కకుండఁ । జేయఁగలము బండ సింగమ్ముపైఁబడి । గెలుచు
నిక్క మింత తెలిసికొనుము॥ ౬౧

క॥ ఒకపాటి బండ సైఁచుటె । సుకరముగా దేము మిగుల స్థూలపుబం
డల్ । పెకలించి పలువురము మీఁ । దికి దొరలించెదము హరికి ది
గులొదవంగన్॥ ౬౨

క॥ కొండయన నేటి యున్న దె । బండలప్రోవెగద! యిందు బండల
కై మా । కొండొకయత్నము వలయునె । "కొండ తలంగలిగి
రాళ్ళకొఱ కేక్ష్వేలా" ౬౩

క॥ కావునసందియమందకు । మీవు హరికిఁజాలననుచు నీక్షింపు మిదే
యీవెంగికొండఁగల వె । న్నోవిధములబండబంతు లోహరిణశిశూ!

ఉ॥ ఏనుఁగుపాటిబండ లొకయిన్నియు దున్నలపాటిబండ
లెన్నినియు నిందుఁ బొల్చెడి, నిదేకను, పొట్టెలపాటిబండలో
యీ నగమెల్ల నయ్యెవిమె, యేనువి యొక్కొకఁడెత్తి తెచ్చి సిం
గానకుఁదాఁకునట్టులుగఁ గాఁడఁగఁద్రోచెద మోడనేటికిన్॥ ౬౫

క॥ బండలుదొరలించెడి మా । దుండగము హరిం దరిమెఱఁగి దూఁకు
నెడల నీ । కొండదరిం దాఁగెద మీ । వొండొకసందియముసందె
దూరక యేలా॥ ౬౬

క॥ అనుటయుహరిణంబిట్లను । దనమానమునున్న దుఃఖదశ పైకుబు
కఁగన్ । "ఘనులార! మీరు నా కొం । పనుడీసితి రింక నేటిబ్రతు
కుం దెరువుల్॥ ౬౭

చ॥ తిరుగుచునక్కడక్కడ, మదింగలకోరికిదీర్చుకొంచు మే
ల్గలతీకచిగుళ్లు మేయుచు సుఖంబుగఁగాలముపుచ్చుచుండఁ, గృపా
కరుని హరుం భజించుచును గాలిక వాహనమైన సింగపుం
గనుఁగొనఁ బాత్రమైననుఁ గస్తికిసగ్గముచేసె మీనుదుల్॥ ౬౮

ఉ॥ "కొండయు బండలుం గలవు కొండొకసందియమందఁబోకు" మం
చండనుజూపుమీ తెలివి కక్కట! యేమనుకొందు సింగము
ద్దండముగాఁగ గర్జిలినఁ దత్తర మెంతటికొండ కేనియుం
గుండెలు బ్రద్దలై గుహలఁ గొండొకగండరగోళ ముబ్బెడున్॥ ౬౯

క॥ కొండగలదయె యిట్లగునెడ । బండలగతి యెంతపాటి!, బండలపై
ను । ద్దండత వయాళిచేయుచుఁ । గొండతలం బరుంచుహరికిఁ గొం
డొక లెక్కా॥ ౭౦

మ॥ ఒకబండన్ బదయుగ్మముంచి మఱి యింకొండొక్కబండన్ జకా
పికిమైఁ గ్రుంగెడునట్లుదూఁకుహరిపై బింకమ్ము నాకెట్లు!, దా
నికినాకుంగల యంతరంబెఱిగియు న్నిప్పాకరణం బెట్లొ పో
రికిమీ రారకులైతి రేమిగతి! దారిన్నాకుఁ జూపింపుఁడీ॥ ౭౧

ఉ॥ పాటెదనన్న సింగ మగుపట్టినయంతన కాళ్ళురా, వెటో
పోరెదనన్న జీవనమెపోవును రెండునుగాక దిక్కులే
దూరక తెచ్చి పెట్టితిరి రోగులరయ్యు మహద్విరోధ, మో
ధీరహితాత్ములార! యిఁక దిక్కెదినాకు వచింపరే పొరిఁ॥ ౭౨

ఉ॥ మందులకై వృథాగఁ బయిమాటఁదలంపక పోరుతెచ్చి "నీ
కెందుకు మేమెయుంటి" మని యేడ్తెఱ సింగముమీఁదికిఁ రయం
బందఱుఁ బోరికిఁ జనుమటందురు నాగతి నేనెఱుంగనే
చిందులుపాగనిచ్చునె గ్రసింపదెసింగము గొంతునొక్కదే॥ ౭౩

తే॥ గీ॥ "అగుదుమేము రోగుల మటులైనఁగాని। వెతకిలంబెట్టిపొదువు" మఱివిధముగాను। పాయమేదేని నాకిట బ్రిదుకుదెరువు। కొఱకువచియింపుఁడయ్య మేల్గూర్పుఁడయ్య॥ ౭౪

క॥ అని వేఁడికొనెడి లేడిని। గని రోగులువల్కిరెఱుఁగఁగాఁజాలవు నీ
ఘనతను, హరిణము హరిక। న్ననునెక్కుడటన్నమాట "గా"
వచియించుఁ॥ ౭౫

మ॥ "నటలన్నిల్పుకొనంగఁజూడు" మనుచుఁ సందేశమంపించి య
క్కట! యీ యక్కటికంపుదుర్దశ గొనంగావచ్చునే! నీదు ని
ప్పటిదైన్యమ్మునుగాంచినఁ బోరిబోరిఁ శ్వానమ్ములు న్నవ్వ నె
క్కటికయ్యానకుఁగాలుద్రివ్వ యిటుజంకఁ బాడిరే నావుకుఁ॥

చ॥ కనుఁగొనలందు బాష్పములుఁగ్రమ్మఁగ లేడివచించు నక్కటా!,
నను నెవుడేనిఁ బోరికి మనం బిసుమంతయు లేనిదాని దు
ర్జనులయి బొందఁద్రోచి యిటు సత్యముదూరముఁజేసి పోరికిఁ
బనిగొని "యేనెపూనితి" నన న్మనసేగతినొప్పె మీ కహా॥

తే॥ గీ॥ లేనిపోనిచుట్టఱికఁబునూని "బాద। రాయణపు" సంగతులు సెప్పి న్యాయవాదు। లమని తగుదుమటంచుఁ గయ్యము నఁజొన్పి। యిప్పుడిట్లందు రేమందు నిందుమిమ్ము॥ ౭౭

క॥ పెట్టితిరికలహమూరక। తుట్టతుదకు నన్ను దోషదూషితుఁగా

మీ । రెట్లిట్లొవల్కు చుంటిరి । కట్టడిలిన మెచటనేర్వగాఁబడె
మీచేత॥ ౨౯

క॥ చిఱుమువ్వలుగట్టిరి మే । ల్గలికపతక లిడిరటంచుఁ గాంచితి మీ
దు । ర్భరకవటవ్యాపార ॥ స్ఫారణంబులెటుంగ నాకుఁ జొప్పడవయ్యేన్॥ ౩౦

ఆ॥ వె॥ ఎచ్చటేనియోగు లిట్టిరుకలరె యీ । మెట్టమీఁదఁదక్క, మి
గులఁదప్పు । వనికిఁజొనిపి యిష్ట పాపంబునామీఁద । గూడఁ
ద్రోయు టేటిజాడ చెపుడ॥ ౩౧

చ॥ ఎఱిఁగియెటుంగ కే కలహ మేర్పడఁబెట్టితి రింకనన్ను శ్రీ
హరికడ కేగిన న్విడువదాహరి, పోరికిసిద్ధమైన న
వ్వరె, హరితోడ లేడికి వివాదమటన్నను విశ్వసింతురె
వ్వరు ?, గత మేల, వేఱొకయుపాయఁజూచి యనుగ్రహింపుఁడీ॥౩౨

క॥ అను లేడిమాటలకు నె । మ్మనమునలజ్జించి “ మేము మంత్రబల
మున । న్నినుసంగము బారికిఁ జి । క్కనీము వెఱఁగందనేల ! కా
చెద ” మనుడున్॥ ౩౩

ఆ॥ వె॥ “ మంత్రములకు నెందు మహిఁజింత కాయలు । రాల ” వను
టవినరెకాలికోలఁదిఁ । బాటిపోయినేను బ్రదికెదఁ జాలు
మీ । పొత్తువలననాకు ముప్పుమూఁడె ”॥ ౩౪

క॥ విని యోగులిట్లనిరి యెం । దునుజనకుము. పాడువిడిచియేగినచోఁ
జి । క్కనుకొనుము మంత్రబలమున । నినుఁగాతుము సందియం
బు నెఱపకు మెందున్ ॥ ౩౫

క॥ మామంత్రశక్తి యొకచో । నేమియుఁబనిసేయ దేని యీ మేమెల్ల
న్నీమానముగాపాడుచుఁ । బ్రేమనొప్పించు మింతబెగ డేమిటికిన్ ॥ ౩౬

క॥ మామాయాశ్రమములలో । నే మెయిఁదిరుగాడు మవలికేగకు
ము సదా । నీమీఁదఁగనుంబెట్టుక । యేమెల్ల జపంబులుడిగి
యీక్షింతు మెటన్ ॥ ౩౭

ఆ॥ వె॥ మంత్రిమనఁగ వేదమంత్రింపఁబెకాదు చి । క్కులను బెట్టఁదగిన గొప్పగొప్ప । యూహకూడ నంచు నొక్కింత యెఱుఁగు మా। మంత్రిమిపుడు చేసి మనుపఁగలము॥ ౮౮

క॥ మామంత్రిములకులోఁబడి । పేరిమను నీయందుఁజూపుఁ బెల్లుగ సింగం । బీ మెయిపిగుంద నేటికి । నేమంబాడఁగూర్తుమింకఁ జింతిలకు మెదడ॥ ౮౯

క॥ దర్భల మోపొక్కటి మా ॥ యర్భకులను దినము దెచ్చునట్లొనరిచి పి । గర్భమ్ము నోమెనము సం । దర్భ మెఱుఁగకేల యింత తత్తఱపడుటల్॥ ౯౦

క॥ ఇదియిట్టులుంచు దర్భా । ర్భదవియనన్బలు హరుని హాణింగద నీ సదనము నీపై సింగము । గదిసి సయుపఁదగినహాని గలుగునె చెపుమా॥ ౯౧

క॥ నావుడు హరిణ "మకట! యీ । దేవయ్యలు పోరు మొదట దెచ్చి యిపుడు మం । త్రివేక్షణమున నన్నుం । గావంగల పెట్టి రెట్టి కార్యజ్ఞులొకో॥ ౯౨

ఆ॥ వె॥ సకలమంత్రిస్వరూపిణి జనని మంచుఁ । గొండరాచూలిపదములుగొలుచుహరికి । వీరిశంత్రాలులక్ష్యమే వీటిఁదులయి । కాని యొండేని యోగులీగతికిఁజనరు॥ ౯౩

ఆ॥ వె॥ వీరిమంత్రాలుమాయలు వీరిపన్ను । గడలు సింగంబు స్ఫుటి లోన నడఁచివైచి । దూఁకునామీఁది కక్కటా! నాకుబ్రిదుకు । దెరువుకనుపట్ట దెటకేని దరలఁటొప్పు॥ ౯౪

క॥ అని మదిఁగలఁపోసి మనం । బును బదిలము చేసికొని "బ్రిబుద్ధుల రై తం । పిని బెట్టి యిపుడు మంత్రిం । బున వారించెదమటన్నఁ బోవుని చెపుఁడా॥ ౯౫

ఆ॥ వె॥ దబ్బకట్ట నా యుదరపోషణమునకు । నర్భకులను దెమ్మనంగ నేల । పాడుదబ్బకట్టతోడ నేజీవించు । టెల్లకాలమట్టు లెఱుఁగఁజెపుడ॥ ౯౬

క॥ అనిదూఱి మంత్రిబలమది । తనమదికెక్కక మొడంద దడదడప
డ సాం । బునిశిరమునఁగలచంద్రుం । గని యటనివసించి బ్రదు
కఁగా నూహించెదన్॥ ౯౭

క॥ అతఁడు గురుద్రోహియొకా । కతిమిత్రద్రోహియగుట యగపడ
లేశీ । స్నుతుకమున నొకకళంకుగ । నతికించుకొనంగ గంగ యనె
ని ట్లొకటన్॥ ౯౮

క॥ ఇది సింహపాదములు తన । మదిలోజపియించి పిదప మర్యాదాహీ
నదురాలోచనచేఁ దా ! నదివదలి యహంకరించు టరసితివికదా!

ఆ॥ వె॥ సింహమనఁగనెవరు ! చెప్పినఁగాని నీ । కెఱుకపడదె మిత్రునె
ఱుగవొక్కొ । అల దివాకరుని ; దదాస్థానరాశి సిం । హం
బు దానికిద్ది యరి మెఱుఁగు॥ ౧౦౦

తే॥ గీ॥ సూర్యమిత్రత్వమెట్టుంగో సూర్యమిత్రి । తకుఁబరిణమింప నత
ని కాస్థానమైన ! సింహమున కరియగు లేడిఁజేర్చికొనుట । త
గదునీకుఁ గళంక మిద్దానఁగలుగు॥ ౧౦౧

క॥ కర్కటకరాశినీయది । యర్కుఁకు సింహంపురాశి నలరుడుఁ ద
త్సం । పర్కమునరూపుగననీ । కర్కునియరిపక్షమందు నాదర
మేలా॥ ౧౦౨

క॥ జడమయుఁడవయ్యు సూర్యుని । యడుగులుసేవించికాదె యగు
చుండెద వె । య్యెడనీవు కలానిధి వ । య్యెడయనియరిపక్షమం
దు నుండుదె చెపుమా॥ ౧౦౩

క॥ అని తల్లిచెప్పుమాటలు । వినిచంద్రుఁడు లేడినొకట విడియువిడు
వకే । తనయందునిల్పుకొనె నె । క్కొని యోగులు సంతసంబు
గొని యుబ్బంగన్॥ ౧౦౪

తే॥ గీ॥ అతని ద్విజరాజటంచు సన్నుతులుచేసి । కొండనెక్కించియో
గు లఖండనతులు । సల్పుచుండిరి, ద్విజరాజశబ్దమహిమ । క
తనఁబక్షు లతనికి లోఁగంగవలసె॥ ౧౦౫

తే॥ గీ॥ అల దివాకరుతేజమ్ము నరయలేక । కొండగుహలందుడాఁగు

నెగ్రుడ్డిపక్షి । యది దివాకరునేగాక యతని వసతి । నైన
సింగమ్ముఁగూడఁ గూయ మొదలిడియె॥ ౧౦౬

ఆ॥ వె॥ గ్రుడ్డిపక్షికూయుకూఁతలు ద్విజరాజు । వినియునూరకుండె
వెల్లమోము । కళ బయల్పడంగఁ గనియోగులెల్ల నా । గ్రు
డ్డిత్రోవ కుబ్బుగొనిరి మిగుల॥ ౧౦౭

చ॥ కపటముఁబూనియోగులు సుఖమ్ముగనుండినలేడికి స్సురం
తపువెతఁగూర్చి యక్కటతనఁ దద్దయు సింగముపై నసూయ మం
డిపడుచునుండ దానిని గడిందిగఁదిట్టఁగ గ్రుడ్డిపక్షి యొం
డు పయికిరాఁగ వారలు గసంగొని మోదమునందు టబ్రమే॥ ౧౦౮

తే॥ గీ॥ గ్రుడ్డిపక్షికిఁదోడయ్యెఁ గువలయాప్తు । నండనుండెడిశశి మొం
డు గండుమిగిలి । రెండునుంగూడ మెఱుఁగ నా కొండపీట ।
నుండుప్రముఖులు వినిరి యాదుండగంబు। ౧౦౯

క॥ విని యోగులుచేసినత । ప్పానకుఁ జింతించి " మీరు పూజ్యులర
య్యు । న్బనికిన్మాలినదుష్కృతు । లొనరింతురె బుద్ధిలేదె యోగు
లుకారే॥ ౧౧౦

ఆ॥ వె॥ ప్రాజ్ఞులయ్యుఁ బాడుపద్ధతిలోఁబడి । తలఁకుఁదగనిపనులఁ దవి
లిరేని । యోగిశబ్దమందునున్నయర్థము చెడి । పోదె యింత
మాత్రిలేదె తెలివి॥ ౧౧౧

తే॥ గీ॥ చెవులపిల్లియు గుడ్డిపక్షియును గూడి । సింగమునుదిట్ట విని
సంతసించువారె । యొక శివంగిసిగని పాఱుటుడిగి మిన్ను ।
చూచు లేడి సింగమ్ము నెచ్చోజయించు॥ ౧౧౨

తే॥ గీ॥ కువలయాప్తుఁడు జడుఁడౌటఁ గూకలిడమి । నఱచుఁగాక చెవు
లపిల్లి యొకటమీరు। గ్రుడ్డిదర్బాగుదురె యోగులనుపేరు ।
వడసినందుకు యోగ్యతవలదె సుంత॥ ౧౧౩

తే॥ గీ॥ చవటచెవులపిల్లులసహస్రంబు కోటి । గ్రుడ్లగూబలుగలిసినఁ
గొంచెమేని । లేడి కుపకారమగునె మీకేడఁదోఁచె । నిట్టిచె
ట్టలు, హరి గెల్చునేమి? లేడి॥ ౧౧౪

క॥ ఈసంగతి నెఱిఁగియు మీ । ర్చేసితిరంతేనిఁ దప్పు ; చెడియె నది
యు మీ । మోసమ్ము కతన, దానికి । వాసింగణియింపమీకు వ
శమే యింకన్ ॥ ౧౧౫

తే॥ గీ॥ వస్తుసారంబు లేనిచో వారువీరు । బారుబూరుమటన్న లాభం
బు గలదె । కొండకును దలవెండ్రుకకును ముడినిడ । నించి
యత్నించి కృతకృత్యు లెవ్వరైరి॥ ౧౧౬

తే॥ గీ॥ అమ్మవిననేని మీపై నహంకరించుఁ । గనుఁడు మీపాట్లు మీఁ
దఁ గుక్కలకు నెఱుక । సింగమా పెవాహనమని వెంగలిపను।
లాచరింతురె యెఱిఁగి సంకోచమెడలి॥ ౧౧౭

ఉ॥ వ్యాసునియంతవాఁడుమును వాసిగడింపక కాశికన్ వృథా
దోసములాడి యూర్ధ్వడల ద్రోయఁబడె న్నివుఁజేమి యంబయే
మీసుగొనుజ్ఞుఁడీ ! తమదునేర్బడినున్నపదార్థముల్ వృథా
గాసికిఁ గూసిపోయు నెడఁ గన్నులుమూసి చరింపకుండిఁకన్ ॥౧౧౮

తే॥ గీ॥ వేయినూటపదియాఱుల వేలుయోగు । లొక్కలైనను గుక్క
కా దొకట గోవు । కొంగయునుగాదు హంసమ్ము గోకిలము
గఁ । గాకిమాఱదు లేడి సింగమునుగాదు॥ ౧౧౯

సీ॥ మహిషాసురునిబట్టి మర్దించుసమయాన నల బిడాలునడంచునట్టి
యెడల । చండముండులఁబట్టి చంపెడితఱియందు ధూమ్రులోచ
ను తలఁద్రుంచునప్డు । రక్తబీజుని నేలరాయుపట్టునఁ జతురునిబట్టి
యమపురికనుచునేళ । బండలలో నెల్లబండలు శుంభనిశుంభదైత్యు
లఁ జావఁజూచునదన॥ తే॥ గీ॥ నంబకీసింగ మెంతసహాయుఁడయ్యె।
నట్టిహార్యతమునకు మీ రనఘులయ్యు । దోసఁగుగల్పించి యెట్లు
బ్రదుకుదురింక । శంక యొక్కంతవలవదే జనులె మీకు॥ ౧౨౦

తే॥ గీ॥ గతము గతమయ్యె నేటి కిక్కలహామునకుఁ । గారకులరైతి
రోచెప్పి నేరమొప్పి । కొని క్షమాపణ చెప్పుఁడు, ఘనులు మె
త్తు । రంతియే కాని తగునె యీ యాగడములు॥ ౧౨౧

తే॥ గీ॥ గ్రుడ్డిపక్షి కూసికొనుఁగాక మీకు నం । బంధ మందు నుండ
వచ్చునయ్య । తెలియకేమొ చేసితిరి తప్పనొకదాని । మఱి
యుఁదప్పులిట్లు జరుపువారె॥ ౧౨౨

కం॥ చెప్పఁడు యథార్థమన వా । "ర్పెప్పె మెమ్మె" యటంచుఁ
బెదవులుతెడుపన్ । జొప్పడినఁ బ్రమథులీగతిఁ । జెప్పిరి యవ్వారి
గతి కిసీయని పెలుచన్॥ ౧౨౩

కం॥ హరభక్తులైనమీ కల । హరినామముఁగూడసైఁప దక్కటతమున నీ
హరిపై నరిత్వమూనితి । రెఱిఁగితి మిదియెల్ల జ్ఞానదృష్టిబలమునన్॥

కం॥ హరిహరులకు భేదములే । దరయుఁడు లేకున్నఁ బోయి హరునడు
గుము, మీ । మొఱకుఁదనమ్ములు విడువుం । డెఱిఁగియు నెఱుఁగని
కుబుద్ధు లైనయకుఁ డిటుపై॥ ౧౨౫

ఆ॥ వె॥ తత్త్వవేత్తకుఁదప్ప నేతద్రహస్య । మెఱుఁగఁగాఁబడ దెందఱో
యిట్లు బొందఁ । బకుచు నుందురు మీరెంత !, పరశివుండె ।
యానతిచ్చె మాకిట్టిరహస్య మొకటి॥ ౧౨౬

తే॥ గీ॥ ఆర్యమతబోధగూడ నీయంశ మన్య । థానచింపదు గనుఁగొ
నఁదగుఁ గడంక । వినుఁడుమామాట చెడకుఁడు శాస్త్రపట్టు ।
దలలుగూడవు మంచిపద్ధతికిరండు॥ ౧౨౭

కం॥ "శివకో" డనుటకుబదులుగ । నెవఁడో "హరికో" డటంచు
నెచటనొయని కా । ర్యవిఘాతముగ నెనని చె । ప్పువిధము మీ
యందుఁదోఁచె మునిమాణులారా॥ ౧౨౮

మ॥ హరివిద్వేషముగూడ దేరికిఁ గశిష్యాదుల్ వృథాద్వేషముల్
హరిపైనూని మ తేమియైరి, చెడకుండాపద్ధతిన్బట్టి శ్రీ
హరిపైనేమి, తదీయనామమునసే, మానామముల్ బూను నె
వ్వరిపైనేమి యహంకరింపకుఁడు శర్వద్వేషమా దానిచే॥ ౧౨౯

కం॥ శర్వద్వేషముగల్గిన । సర్వద్వేషంబుగల్గు, సాక్షి యిచట దు । ర్గ
ర్వుఁడు దక్షుం డెఱుఁగుఁడు । గుర్వాక్షేపకులతో ప్రివఁ గొని చెడ
కుఁ డిఁకన్॥ ౧౩౦

ఆ॥ వె॥ కుక్కతోఁకఁబట్టి గోదావరిఁదరింపఁజూడఁబడినతోర్విష విరోధువ
ట్టుదలల । యందుఁగానఁబడెడి, నకట! లేదికీ-సింగ్ । మున
కు నేడ కేడఁగనుఁ డొకింత॥ ౧౩౧

ఆ॥ వె॥ ఎందతేనియోగు లీకొండవీటను । న్నారుగాదె, వారుమీ
రొనర్చు । పనికినేవపషట ప్రత్యక్షముగ మేమె । ఱింగినార
మిట్టిభంగితగుర॥ ౧౩౨

క॥ హారి కరులగుటను మి మూర్త । హారికేలనెసంగునాయుధాగ్రిణి
తానొ । క్కరియయ్యె సుదర్శన మి । త్తఱి మీకుఁ బుద్ధిచెప్పఁ
దలఁచెనఁట! కదా!॥ ౧౩౩

క॥ పంకమునడాఁగినీచులు । కొంకకఘనులకును బీడగొలిపెదుతఱి నా ।
సంకటముదీర్పుటకునది । కంకణముధరించుమాట గజకథ దె
లుపుఁ॥ ౧౩౪

క॥ కలికుక్కగంగిగోవుగ । నెఱపంగ నెనందు నేర్చు, నిష్కైతుకసం । గర
ములుకల్పించుటయును । బరమార్థమెమీకు దీనఫలమున్నదియే॥

ఉ॥ యోగిపదమ్ముఁగాంచియు నయుక్తపుఁగార్యములాచరించి పై
జోగులనైతి రేని మిముఁజాలిసహింపఁడు ప్రాజ్ఞులెవ్వరుఁ
బాగనరానిపద్ధతికిఁ బాల్పడి చెట్టలొనర్చునట్టి మీ
యోగడ మింకనైన నడుగంటెన సేమముగాంతు రింతటఁ॥ ౧౩౬

క॥ ఒకరికిఁదగవులగిద్దడి । ప్రకటమతులుమీరె వెఱ్ఱిపద్ధతిఁబడి దు ।
ష్టకృత్యులనల్పిన నెవరిఁక । వెకలితనమ్మునకుదిగక వెనుదీసె
దరో॥ ౧౩౭

క॥ అనిమందలింపవారలు । మనమునఁదమచేయుపనికి మఱివ ఱిలజ్జం
గొనితప్పనొప్పుకొనితమ । ఘనతకుఁదగినట్లుమెలఁగఁగాఁ, దొడఁ
గిరొగిఁ॥ ౧౩౮

ఆ॥ వె॥ గుడ్డిపక్షి కూసికూసి నోర్పడిపోయి । కొండగుహకుఁబోయి
గుడ్లు తెఱచె । నల్లచెవుఁపిల్లి యల గురుద్రోహి మం । డ
లమునుండి ముంచు నాకుచుండె॥ ౧౩౯

ఆ॥ వె॥ ఇంత గాథ జరిగెనేనియు సింగమ్మ । తనకుఁ గానియట్లు తలఁ
చెఁ గాని । కలుగఁ జేసికొనదు కలికాపదభక్తు । లిట్టి కొదలు
లెక్కయిడుట కలదె॥ ౧౮౦

తే॥ గీ॥ అఖిలసంగపరిత్యాగులైన యోగి । వరుల కేనియు వనమృగ ప
రిచయమున । నంతమాత్సర్య ముదయించె నట్లుగాన । సం
యములకెందు సంగదోషంబు తగదు॥ ౧౮౧

క॥ అని తాత చెప్పనక్కథ । విని యోగులయందుఁ గల్గు వెకలితన మిసీ
యనిపింపధర్మజుఁడు తా । తను గొనియాడుచును సత్కథలు విను
చుండెన్॥ ౧౮౨

క॥ ఇది చదివిన వారికి ను । ర్వ్రదులొనరుచు సుష్టకృతులు హీనమతుల
త । స్పిదములును దెలియుఁ గాళీ । పదభక్తుల మహిమ దెలియఁ బ
డుఁ బూర్ణముగన్॥ ౧౮౩

సంపూర్ణము.



